శ్రీ

గురుభ్యో నమః

తాత్పర్యసహిత

# రాజయోగశతకము.

# విజ్ఞప్తి.

క॥ జంభాల పోతుగోరునె
సంభవనాశములులేని చక్కనిబోధన్
కుంభిని షండునకుండునె
రంభా సంభోగవాంఛ రంభనుగనినన్

శ్రీమద్బృహద్వాశిష్ఠ అచలబోధ సిద్ధాంత నిర్ధారకులగు శ్రీమద్రాముడు శివరామదీక్షిత గురుసాంప్రదాయులగు శ్రీలింగంకోట బైరాగి గురుస్వాములవారు చరణసేవాశిక్షార్థి పరుడనై వారిచే ద్వాదశి, షోడశి, మంత్రిమంత్రార్థంబులు సాంగోపాంగముగ బోధపడసి గురువాజ్ఞగైకొని దేశాటనము జేయుచు కావలితాలూకా సోమవరప్పాడు అనుగ్రామంబున నిలచి అచ్చట కొంతభక్తసంఘమును గూర్చుకొని ప్రస్తుత కాలము నివాసముచేయవలసివచ్చెను. అంతట కొన్ని వేదాంత శాస్త్ర సంబంధమగు శ్రీరామమూర్తిశతకము, జ్ఞానస్తృతి, అచలతత్వరత్నావళి. భగవత్కళ్యాణగుణకీర్తనలు, పరిపూర్ణ తీర్థయాత్ర, అనుగ్రంధములను స్వయముగవ్రాసి భక్తజనముల ద్రవ్యసహాయముచే ముద్రింపించి భక్తకోటిలో ప్రచురబరచుచుంటిని. ఇట్లుండగా సకలవేదాంత సారసంగ్ర

హంబను రాజయోగశతకమును పాఠకులకు అతిసులభోపాయముగనుండునటుల వ్రాయుడని కొందరు నామిత్రులు కుతూహపరులగుటచే దీనిని వ్రాయుటకు సమకట్టితిని. శ్రీరాజయోగశతకమునందలి తాత్పర్యమును మదీయ శిష్యుడగు వేపూరు రామచంద్రారెడ్డి వ్రాయుటకు ఉత్సాహపడి మదీయయాజ్ఞనుబడసి నీశతకమందలి ప్రతిపద్యమునకును తాత్పర్యము వ్రాయబూనుకొనెను. ఇందలి యెట్టిలోపంబులున్నను చదువరులుజూచి సవరించుకురని ప్రార్థించుచున్నాను. హైదరాబాదు రాష్ట్రములో కరీనగరముజిల్లా హుజూరాబాదు తాలూకా గూడూరు పురవాస్తవ్యులగు అంకతి రాఘవదేశికేంద్రులవారి శేవాప్రశపరాయణుండగు కానలితాలూకా తెల్లపాడు గ్రామవాస్తవ్యులగు చల్లా కొండయ్యగారి సుద్రవ్యసహాయముచే శ్రీరాజయోగశతకమును ముద్రింపించి అచల గురుభక్తమండలిలో సమర్పించితిని.

భక్తజనవిధేయుడు,

ఉంగుటూరు రామమూర్తి,

సోమవరప్పాక.

శ్రీ

# రాజయోగశతకము.

## తాత్పర్యసహితము.

సీ. శ్రీగురుబ్రహ్మచరణ స ♦ సేవజేసి
జన్మకర్మంబు మూలముల్ ♦ సరణిదెలసి
నిగమసత్యార్థ మెఱిగింతు ♦ నిజమునరసి
సమ్యగుణాభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 1

తా॥ ఈగ్రంథకర్త శ్రీగురుచరణసేవాసక్తిపరుడై జన్మకర్మములయొక్క మూలముదెలిసికొని వేదములవాక్య సత్యార్థమును లోకమునకు వెల్లడి చేయుచున్నాడు.

సీ. అవని శ్రీ టంగుటూర్వంశ ♦ మారువేల
ఘనత కౌండిన్య సాది స ♦ గోత్రశీల
శ్రవణమొనరింపు మధ్యాత్మ ♦ చర్యలీల
సమ్యగుణాభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 2

తా॥ ఈగ్రంథకర్త గురువు తనకు దెలిపినటుల వ్రాయుచు, తనవంశమును, గోత్రమును, లోకమునందు భక్తకోటికి తెలుకచేయుచున్నాడు.

గీ. రాజవిద్యాభిలాషవి ♦ రాజకీర్తి
భావ నిశ్చింత వైరాగ్య ♦ భవ్యకీర్తి
రాజయోగ విలాసజన ♦ రంజితార్తి
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 3

తా. శ్రీరామమూర్తి అరువదినాలుగు విద్యలకెల్లను త్తమమగు రాజవిద్య (బ్రహ్మవిద్య) నెరిగింతు. నీవుజితేంద్రియుడవు. రాజయోగమనుభవించువాడవు. గావుననే వినుము.

గీ. గురుగణంబును లక్షించి ♦ గుప్తపరచి
అంత్యప్రాసలు యెతిగణము ♦ లమరగూర్చి
బలుకబూనితి శతకముగ ♦ భ్రాంతిదలచి
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 4

తా॥ నాకుయితరలక్షణములతో పనిలేదు. గురుమంత్రధ్యాన బీజమను గణమును యీపద్యములయందు పొందుపరచి అంత్యప్రాసలు యెతులను చక్కగాగూర్చి చెప్పదలచితిని వినుము.

గీ. బుద్ధియోగముస్థితః ప్రజ్ఞ ♦ పురుషుడెరుగు
కుకవులేమెరుగు ప్రజ్ఞను ♦ గుప్తవెలుగు
ప్రాజ్ఞులైనట్టి సుకవుల ♦ గృహుపరాకు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 5

తా॥ ఈగ్రంథకర్త కుకవులను నిరసించి, సుకవులకు పరాకు చెప్పినాడు. పరాకు అనగా గౌరవపదము. (కుకవులనగా) అజ్ఞానులు (సుకవులనగా) నియమిత చిత్తముగలవారు గావున స్థితిః ప్రజ్ఞుడని సంబోధన.

గీ. సత్ప్రసంగవిచారణ ♦ శాస్త్రనగుమ
అల్పవిద్యాప్రసంగము౯ ♦ నరయబోదు
సత్యసాంబ్రాజ్య సౌధము౯ ♦ శయనవరుడు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 6

తా॥ వేదాంతవిచారణ చేయువాడు తుచ్ఛములగు విషయములవంక మరలడు. వాడు సర్వావస్థలయందు అచల సాంబ్రాజ్యమహలునందు, శయనించి హాయిగా నిరతిశయానందమనుభవించుచున్నాడు.

గీ. సత్ప్రసంగంబు సాధు స ♦ త్సంగమునను
నిత్యమభ్యాససాధనా ♦ నియమమునను
భావనిశ్చింతవైరాగ్య ♦ భక్తుడగును
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి 7

తా॥ వేదాంత శ్రవణము సత్సాంగత్యము యమనియమాది అభ్యాసము సేయువాడు నిశ్చయమగు అంతర్వైరాగము తోగూడిన భక్తుడగును.

గీ. సద్గురుప్రోక్తలక్ష్యార్థ ♦ శాసనములు
సాధనోపాస్తి ఘనసద్వి ♦ చారపరులు
సజననిర్జనస్తలమరసి ♦ సలుపుబుధులు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 8

తా. గురుమూర్తి ఉపదేశించు రహస్యములెవ్వియనఁగా సాధన, ఉపాస్తి, విచారణ మొదలగు శాసనములు. వీటిని నిర్జనస్తలమందు ఏకాకియై అభ్యసించు సాధకుడే వేదాంత విచారపండితుడు.

గీ. సాంఖ్యతారక ఘనయోగ ♦ చక్రములను
త్రిప్పనేర్చినధీరుడీ ♦ త్రిజగములను
సాధకుండగు బోధనా ♦ చార్యుడగును
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 9

తా॥ భక్తా, సాంఖ్య తారక మనస్కముల మూడింటిని తెల్పగా విచారించి యితరులకు బోధించువాడే శాస్త్ర విచారశీలుడనబడు బోధాచార్యుడు. ఇతడు ముల్లోకంబులను సర్వపూజ్యుడనబడును.

గీ. శ్రద్ధవిశ్వాసమను ఘన ♦ సాధనముల
భక్తివైరాగ్యజ్ఞాన స ♦ ద్బోధరతుల
ఊర్ధ్వయోనిని రమియించు ♦ యోగలీల
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 10

తా॥ గురువు ఉపదేశించిన వేద మహావాక్యార్థమునందు శ్రద్ధ విశ్వాసము అను సాధనములచేత వైరాగ్య బోధోపరతులు గలుగును. అట్లు గలిగెనేని సాధకుడు సదా ఊర్ధ్వయోని నిరమించు చుండును. (అనగా బుద్ధి అంతర్ముఖమైనచో, స్వస్వరూప సాక్షాత్కారము గలుగును.)

గీ. శుక్లశోణితమాకార • సుంటిబొమ్మ
మోహత్రైగుణ్య కళరాసి • మస్టుగుమ్మ
భవవినాశిది పెనుమాయ • పాతకమ్మ
రమ్యగుణభోగి సత్కీర్తి • రాజయోగి. 11

తా॥ భక్తా! శుక్ల శోణితాద్యాకార స్వరూపమగు అనగా సప్తధాతువులుచే కప్పబడిన మరలబొమ్మ. ఇదిరజస్సత్వమోగుణములచే గూడిన స్థూలశరీరము పుట్టుచావుల నొందెడు పెనుమాయభూతమని దెలియుము.

గీ. శుక్లశోణితశివశక్తి • సృష్టినరయ
ప్రకృతిపురుష సరూపులై • బరగెమాయ
మరుగుదెలియని మనసుచే • మనుజుడాయ
రమ్యగుణభోగి సత్కీర్తి • రాజయోగి. 12

తా॥ శుక్లశోణితముల రెంటియొక్క కలయికచే, సమిష్టి దృష్టిగల విద్యోపాధియగు ఈశ్వరుడాయెను. యిదేతీరుగా వ్యష్టిదృష్టిగల అవిద్యోపాధియగు కూటస్థుడనబడు జీవుడాయెను

యీసత్యమును మనస్సు తెలియజాలక భ్రమవలన అజ్ఞాను డగు మనుజుడాయెను.

గీ. ప్రాణమరయంగ శుక్లమౌ ♦ బ్రహ్మకళలు
బరగె రక్తంబ పానమై ♦ ప్రకృతికళలు
ప్రకృతిపురుషుల సంగమీ - భ్రాంతికళలు
రమ్యగుణభోగి సత్కీర్తి - రాజయోగి. 13

తా॥ అట్టి జీవకళలగు ప్రాణాపానవాయులు శుక్లశోణితములనబడు ప్రకృతి పురుషులకళలై ఆరెంటియొక్క సంయోయోగముచేత బాహ్యాంతరప్రపంచములు భ్రమరూపములై దోచుచున్నవి.

గీ. శుక్లశోణితధారయీ - స్థూలఘటము
మూలమెరుగరు పండిత - మూఢజనము
శుక్లశోణిత సంధియె - సూరిపథము
రమ్యగుణభోగి సత్కీర్తి - రాజయోగి. 14

తా॥ నాయనా! తల్లిదండ్రులు సంయోగమున వెలువడు ధారయే యీశరీరము. దీనిమూలమును పండితమూఢులు తెలియరు. యీ రెంటియొక్క సంధిని తెలిసికొన్నవాడే జ్ఞానియని చెప్పబడును.

గీ. శుక్లశోణితమీ రెంటి - జూనరసి
మతిముజాతియు కులమును - మరుగుదెలసి

బయలుపరచిన గురుడేసి - భాగ్యరాసి
రమ్యగుణభోగి సత్కీర్తి - రాజయోగి. 15

తా॥ శుక్లశోణితములు రెండును శివబీజశక్తిబీజములన బడును. యీశివబీజము పురుషుడుగను శక్తిబీజము ప్రకృతిగను యేర్పడెను. యీరెంటిని చక్కగా విచారించిన ననుభవజ్ఞులకు జాతి, మతము, కులము అను భేధ దృష్టి వదలిపోవును. అట్టివాడే గురువు. భాగ్యరాసియనుటలో విద్యాస్వరూపుడని అర్థము.

గీ॥ కర్మజడభూమి భోగించు - కలుషజనుడు
మోక్షరాజ్యంబు పాలించు - ముక్తఘనుడు
కర్మదూరుడు నైష్కర్మ్య - ఘనతిపరుడు
రమ్యగుణభోగి సత్కీర్తి - రాజయోగి. 16

తా॥ శిష్యా! పాపాత్ముడు తుచ్ఛములగు కర్మములను ఫలకాంక్షచే చేయుచుండును. మోక్షార్థియైనవాడు యీతుచ్ఛములగు యిహలోక సుఖమునువదలి పరిపూర్ణ రాజ్యమునందు పాలించుచుండును. అనగా క్రీడించుచుండునతడే నిష్కర్మపరుడగు కర్మత్యాగి.

గీ॥ కామ్యకర్మంబ విద్యాంధ - కారమునను
విషయఫలకాంక్ష దృష్టియ - విద్యయగును
మనశ్శిథిలుండ విద్యచే - మునిగిజెడును
రమ్యగుణభోగి సత్కీర్తి - రాజయోగి. 17

తా॥ అజ్ఞాని కామ్యకర్మంబు లాచరించుచు అవిద్య అను చీకటి ఆవరణమునచిక్కి మనస్థిమితము లేక చెడునుగాని, అతడు సత్స్వప్రదీపమును సాక్షిగా చేపట్టుకొని ఉన్నదున్నట్టుగా విచారించడు.

గీ॥ కర్మకాయంబు జడమనో - ఘటమునందు
యింద్రియోపాధిధ్యాసచే - యిహము పొందు
జెంది జీవించు విషయముల్ - జీవుడందు
రమ్యగుణభోగి సత్కీర్తి - రాజయోగి. 18

తా॥ భక్తా! జీవుడు జన్మార్జితకర్మబద్ధుడై, యీజడ శరీరమునజిక్కి యింద్రియోపాధులచేత తుచ్ఛములగు విషయమందు వశీభూతుడై తన్ను తెలియనేరక అంధకారమను అజ్ఞాన చీకటికోనలో తిరుగుచున్నాడు.

గీ॥ కర్మజీవున విద్యాంధ - కారమునను
సావయరూపు కళసేయు - జన్మముగను
చిత్రకారునిగను నీదు - చిత్తమునను
రమ్యగుణభోగి సత్కీర్తి - రాజయోగి. 19

తా॥ శిష్యా! జీవుడు అవిద్యాంధకారమునజిక్కి సాకారుడై జన్మకర్మలకు బద్ధుడౌను. నిర్గుణుడు నిరాకారుడగు జీవునకు గుణములు రూపము కల్పించిన దెవరో ఆమూలాగ్రములను నీవు దెలిసికొనిన తరింతువు.

గీ. కర్మవాసన జడాంధ ♦ కారమునగు
దేహిమధ్యను సత్య ప్ర ♦ దీపవెలుగు
నీడవృత్తియహంకార ♦ నిలయమునగు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 20

తా॥ దేహి దేహవిలక్షణుడగు శుద్ధచైతన్యుడు పూర్వకర్మవాసనాత్రయములచేత మనోమాలిన్య జడశరీరియై అహంకారమమకారములకు నిలయుడై నాడు. యిట్లగుటగు మూలసూత్రధారి యెవడు విచారించి తరించుము.

గీ. రూఢిగీతార్థమెరుగడు ♦ రౌడినరుడు
జ్ఞానవైరాగ్యసముపేప్ర ♦ జ్ఞానఘనుడు
జన్మగీతార్థమెరిగిన ♦ జాణుడతడు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 21

తా॥ శిష్యా! సత్యార్థమును తెలియనిమూఢుడు రౌడియనబడును, అనగా; చపల చంచలచిత్తుడు. అని తెలియుము. సత్యార్థమును సదా మననముచేసి, జ్ఞానవైరాగ్యము అలవడిన వానికి సరియైనవాడు ముల్లోకములలో లేడు.

గీ. సత్యదయశౌచలక్ష ♦ శాంతిధరుడు
శమము దమమున జపతపో ♦ జాగ్రపరుడు
దైవసంపత్కటాక్ష వి ♦ దేహనరుడు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 22

తా॥ భక్తా! సత్య, దయ, నిష్ఠ, శాంతి, బాహ్యాంతర యింద్రియ నిగ్రహము జప తపములయందు జాగ్రత్తగా మెలగువాడె, దైవభక్తిగల విరాగి. యితడె విదేహుడు.

గీ. బ్రహ్మచింతయే శ్రీగురు ♦ పాదచింత
మోక్షసాంబ్రాజ్య వైభవ ♦ ముక్తికంత
బంధ నరకంబె సంసార ♦ పాపచింత
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 23

తా॥ శిష్యా! సర్వకాలములయందు గురుధ్యానమే భగధ్యానముగా జేయువాడు బంధమునువదలి సంసారమను నరకమునుదాటి మోక్షరహస్యమును దెలిసికొనుచున్నాడు.

గీ. పాపరాజ్యంబు పాలింప ♦ భక్తి సున్న
పుణ్యవ్రతశీలురకు స్వర్గ ♦ పుడమి నెన్న
పుణ్యపాపంబు లెనసిన ♦ పూజ్యుడన్న
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 24

తా॥ శిష్యా! పాపరాజ్యంబనగా, దేహాత్మ వాదికి జ్ఞానము సున్న, దేహాధిష్ఠానము దెలిసిన పుణ్యాత్మునకు ముక్తిబహు సులభము. వాడే పుణ్యపాప విముక్తుడు, సర్వపూజ్యుడనబడును.

గీ. పాపపుణ్యంబులకుభయమె ♦ పట్టుకొమ్మ
భయకల్పిత జీవుడీ ♦ పాపిబొమ్మ

భయవిదూరుడే లోక ని ♦ ర్భయుడు సుమ్మ
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 25

తా॥ పాపపుణ్యముల తెలియవలెనన్న భక్తి ప్రధానము. జీవుడు షడ్వికారములకు లోనై తెలియజాలడు. భయభక్తి శ్రద్ధలచే పుణ్యపాప విమర్శనచేయువారికి ఎందును భయము లేదు. పాప పుణ్యములనగా, బంధముక్తులని తెలియవలెను.

గీ. బాహ్యజగమెల్ల జడభూమి ♦ బ్రాకునరుడు
జడము మధ్యను చైతన్య ♦ జాడగనడు
మనసుమాలిన్య జడజగతి ♦ మాయనరుడు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 26

తా॥ శిష్యా! బాహ్యప్రపంచ విషయలోలుడవై నీవు సంచరించుచుంటివిగాని ఆజడజగత్తుమధ్య సర్వగత చైతన్యమును తెలియలేవు. దానిని తెలియదలచితివేని, నీమనో మాలిన్యమునువదలి యీ జగత్తత్వముయొక్క మూలమును తెలియుము.

గీ మనశ్శిథిలంబు సంసార ♦ మాయలయ్యె
కామపుప్పులు పాలింప ♦ కర్తలయ్యె
బుద్ధియింద్రియ ద్రష్టయా ♦ భువనమయ్యె
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 27

తా॥ నాయనా? నీఅంతఃకరణము వాసనాదులకు వశమై సంసారమను బంధమునకు హేతువైయున్నది. అందుచేత కామాదిశత్రువులు విజృంభించి దిరుగుచున్నవి. కార్యకారణరూపమగుబుద్ధి వీని కన్నిటికిని, ద్రష్టయైయున్నది.

గీ. తినవులింద్రియ వస్తులన్ ♦ దాటినరుడు
బుద్ధిసంతర్ముఖని జేయ ♦ బోధగురుడు
సుప్తివెలుగొందు ప్రజ్ఞాన ♦ జ్యోతిమయుడు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 28

తా॥ స్థూల సూక్ష్మకారణ శరీరములు, జాగ్రత్స్వప్న సుషుప్తి అవస్థలనుదాటి మనసు బాహ్యవిషయములందు బోనీక సుషుప్తి యవస్థయందు సర్వేంద్రియాభావమైనప్పుడు ఏ ఆత్మస్వరూపము జ్ఞానమైప్రకాశించుచున్నదో దానిని తెలుసుకొనుము.

గీ. జీవకారుణ్య పరలోక ♦ చింతపరుడు
స్థిరతరంబగు సమతినుర్క ♦ సిద్ధినరుడు
విషయవాసనఫలత్యాగి ♦ విభవపరుడు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 29

తా॥ భక్తా! భూతిదయగలిగి పరలోక చింత సేయుచు, సమస్తజీవలోకము తన స్వరూపమను దృఢమగు జ్ఞానముగలిగి విషయవాసనల బరిత్యజించినవాడే వేదాంతవేత్తయని అర్థము.

గీ. స్తుతియునిందల సంప ♦ ద్విపత్తులందు
సర్వసమభావ మొదవిన ♦ సాధులందు
యోగగృహలీల సలిపెడు ♦ యోగులందు
రమ్యగుణభోగిసత్కీర్తి ♦ రాజయోగి. 30

తా॥ శిష్యా! దూషణ, భూషణములు కలిమి లేముల యందు సమభావ దృష్టిగలిగి సదా నిశ్చలమగు యోగభావన చేత చరించెడి వారిగృహపాలన యోగగృహమని చెప్పబడును. ఇతడే రాజయోగి.

గీ. అస్తిమాంసంబుత్వక్పృధర ♦ మాలయంబు
నీచసుఖభోగజీవుని ♦ నిలవరంబు
మూత్రదుర్గంధమలభాండ ♦ మూలనంబు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 31

తా॥ భక్తా! సప్తధాతువులతోగూడినదియు, మలమూత్రదుర్గంధపూరితమగు శరీరఘటమునందు తుచ్ఛములగు విషయాదిసుఖము లనుభవించు జీవికి యీదేహమే నివాసస్థానమై యున్నది.

గీ. సకలపురుషార్థ మనుభవ ♦ సాధనంబు
పాంచభౌతిక దేహమకా ♦ పట్టణంబు
బ్రహ్మకళలజీవి స ♦ త్పాలనంబు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 32

తా॥ శిష్యా! జ్ఞానులగువారు అట్టిదేహముచేత గురుశాస్త్ర నిర్ణయమువల్ల దేహదేహముల విమర్శించి సకల పురుషార్థములను సాధించుచున్నారు. ఇంతకు మించిన సాధనమే లేదు.

గీ. వ్యష్టికించద్గుణము లా ♦ వరణమునను
దేహకోశంబులింద్రియ ♦ దేశమునను
జీవిమాలిన్య కర్ముడై ♦ చిక్కుబడెను
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 33

తా॥ నాయనా? బహిరంతరేంద్రియోపాధి సమూహముయొక్క భ్రమచేత ప్రపంచ మేర్పడెను. అట్టి జగత్తుయొక్క మూలము దెలియక అజ్ఞానుడు కండ్లులేనివాడై ప్రాకులాడుచున్నాడు.

గీ. భక్తిసింధువు మధ్యను ♦ బడిననరుడు
భేదదృష్టిని నొందడ ♦ భేదపరుడు
అంధుడైగను నఖిలంబు ♦ నచలుడతడు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 34

తా॥ భక్తా! భక్తియను మహాసముద్రమధ్యంబున నుండి అభేద దృష్టిగలిగి సదా పరలోక చింతనీయుడగు జ్ఞాని, ప్రపంచమునందుండియు (అనగా జ్ఞానికి ప్రపంచద్వార ప్రతీతి

యగుటలేదు. గ్రుడ్డివానివలె ప్రపంచ దృష్టిలేనివాడై సకల ము చూచుచున్నాడు.

గీ. ద్వైతమద్వైత విశిష్టా ♦ ద్వైతినరుల
జీవశివభేదమతదృష్టి ♦ జెందనేల
పూర్ణదృష్టినివిహరించు ♦ పుణ్యశీల
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 35

తా॥ శిష్యా! రామానుజమతమని, శంకరమతమని, మధ్వమతమని, విష్ణువని, ఈశ్వరుడను భేదములతో తనకు పనిలేక సదా సర్వవ్యాపకదృష్టిగలిగిన పుణ్యాత్ముడవుగమ్ము.

గీ. ధ్యానయోగంబు విజ్ఞాన ♦ ధారయయ్యె
శ్రవణభక్తియు పరచింత ♦ సాధనయ్యె
యోగరాజ్యంబు నజ్ఞుడు ♦ నెరుగడయ్యె
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 36

తా॥ భక్తా! ధ్యానయోగము తైలధారవలె ఎడతెగని ధారవంటిది. దీని గురుముఖమున సత్యార్థము వినుట, విన్న దానియందుభక్తియుంచుట, ఆధ్యాత్మవిద్యకు ముఖ్య అంగమువంటిది. అజ్ఞానుడు యిట్టిఅఖండసామ్రాజ్యము తెలియడు గదా.

గీ. హంసపంసారజలధిని ♦ ఆటపక్షి
మునకవేచుచు తేలెడు ♦ మనసెసాక్షి

హృదయనభమున దిరిగెడు ♦ యోగపక్షి
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 37

తా॥ శిం సోహం, అను రెండక్షరములు ప్రాణాపాన రూపకళలతో రేచక పూరకములై వచ్చుచు పోవుచు అనాహత చక్రమును గమ్యస్థానముగా జేసికొని సంచరించుచుండును. అనగా హృదయాకాశముననుసరించి మనస్సు మారుత మూలముగా సర్వవ్యవహారము జేయుచున్నది.

గీ. దృశ్యవస్తువు క్షణికమై ♦ దృశ్యమయ్యె
దృశ్యరాజ్యవిలక్షణ ♦ దృక్కయయ్యె
ప్రకృతిదృగ్దృశ్యలీలా ప్రపంచమయ్యె
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 38

తా॥ శిష్యా! నీకు గోచరించు సమస్తమును సుషుప్తియందు శూన్యమైనందున, దీనిని మిథ్యయని చెప్పుదురు. స్వభావమై మూలప్రకృతియె ద్రష్ట దర్శ, దృశ్యములైనందున ప్రపంచోత్పత్తి నాశములకు కారణామైనది. క్షణికమనగా ఒకప్పుడుండి మరియొకప్పుడు లేనిది.

గీ. కామక్రోధాదిత్రైగుణ్య ♦ కర్మగృహము
జన్మరాసియుపాపచయ ♦ నాలగనుము
సాధు జనశ్రేణికిది తిసో ♦ సాంఖ్యగృహము
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 39

తా॥ ఓనరుడా! త్రైగుణ్యములగు రజ, సత్త్వ, తమో గుణవికారమైన యీ క్షురము కామాది శత్రుసముదాయము చేత నిన్ను మాటిమాటికి జన్మ, కర్మబంధమను చెఱసాలలో బంధించినవి గావున స్వస్వరూప విచారణ జేసితేవని ఇది యోగ గృహము.

గీ. పంచప్రాణంబులింద్రియో ♦ పాధివిషయ
గోలకల్లోల భ్రమలె భూ ♦ గోళమరయ
దృశ్యజడజగతినంధుడై ♦ ధూర్తుడాయె
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 40

తా॥ నాయనా! బహిరంతరేంద్రియోపాధి సముదయా భ్రమ కల్లోలమే భూగోళాకారమై ఏర్పడెను. యిట్టి భూగోళాకారముయొక్క మూలమును దెలియక కండ్లు లేనివాడై అజ్ఞానమను చీకటి కోనబడి మూఢుడు ప్రాకులాడుచున్నాడు.

గీ అన్నకోశంబుసద్భావ ♦ మూలయంబు
ప్రాణవిజ్ఞానఘన మనో ♦ పాలనంబు
జన్మమానందకోశమా ♦ జడజగంబు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 41

తా॥ శిష్యా! స్థూలదేహమె అన్నమయకోశము ప్రాణమయకోశము, మనోమయ కోశము, విజ్ఞానమయ కోశము, అను యీ త్రికోశములను సూక్ష్మశరీరమనబడును. ఆనందమయ

కోశమను కారణశరీరము జగదుత్పత్తిహేతువైనది.

గీ. స్థూలదేహంబు విను భోగ ♦ స్థానమయ్యె
సూక్ష్మదేహంబు భోగాది ♦ సాధనయ్యె
పాపకారణదేహ సం ♦ ప్రాప్తమయ్యె
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 42

తా॥ శిష్యా! జీవునకు యీస్థూలదేహము ఒక భోగ వస్తువైయున్నది. దీనిని భోగించుటకు సూక్ష్మదేహమే భోగ సాధన వస్తువైయున్నది. కారణదేహమనునది యీరెంటికిని మూలబీజమని యెఱుంగుము.

గీ. కర్తకర్మము క్రియ త్రిగుణ ♦ కలితభూమి
జన్మరాజ్యంబు జడయింద్ర ♦ జాలభూమి
జీవభోక్తనుజూచి యో ♦ చింపవేమి
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 43

తా॥ భక్తా! యిట్టికర్తృత్వాది త్రైగుణ్యములతో గూడిన యీశరీరమునందు జీవుడు సూక్ష్మజడశరీరధారియైయున్నాడు. గురువను గ్రహముచేత శ్రవణాదులవల్ల, అట్టివానిని విచారించి తెలిసికొనుము.

గీ. స్థూలసుఖదుఃఖముల్ సెనయ ♦ సూక్ష్మమయ్యె
సూక్ష్మమంతర్మనోమయ ♦ సృష్టియయ్యె

సుషుప్తిశివజీవభేదమై ♦ శూన్యమయ్యె
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 44

తా॥ నాయనా! సుఖదుఃఖాశ్రయమై స్థూలదేహము జాగ్రదవస్థకు హేతువై యున్నది. మనోవికారమగు స్వప్నాద్యవస్థకు సూక్ష్మశరీరమునకు హేతువైనది. సుషుప్తియందు సమస్తమభావమై (అనగా అభేదమైకోచి నిమిత్తమాత్రము కారణదేహమంది సృష్టికి కారణమైనవి.

గీ. స్వప్నసమితిని ద్రష్టయగు ♦ జాణయెద్ది
నిరవయవమగు సుప్తినిఁ ♦ నెగడునెద్ది
సావయవమగుజాగ్రముఁ ♦ సాక్షియెద్ది
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 45

తా॥ శిష్యా! పైవివరించిన జాగ్రత్స్వప్న సుషుప్తి అవస్థలకు సాక్షియై మూఢవస్థలను సదా జూచుచు నిరంతర మొక్కతీరుననున్న సూత్రధారుని తెలిసికొనుము.

గీ॥ బ్రహ్మాశనవ్యంబుగనుదోచు ♦ భ్రాంతి జగము
రాతియందలి చిత్తరువు ♦ రంగువిధము
చిత్తభ్రమలీల దృశ్యమీ ♦ చిత్రజగము
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 46

తా॥ శిష్యా! పరిపూర్ణంబునకు సంబంధములేని జగత్తు

జీవములేని చిత్రప్రతిమవంటిది. ఈ ప్రతిమ నీఅంతఃకరణ వికారమువల్ల గలిగినదేగాని, వేరుగాదు. మనమేవప్రకల్పితః అనివేదములు చాటుచున్నవి.

గీ. స్థూల సూక్ష్మంబులింద్రియ ♦ సాధమునను
విషయభోగ విలాసంబె ♦ విశ్వమగును
విశ్వమేర్పడె శబ్దాది ♦ విషయములను
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 47

తా॥ శిష్యా! తుచ్ఛములగు విషయసుఖములచే యే ర్పడిన యీవిశ్వము శబ్దాది విషయములకు మూలమైనది. అనగా స్థూల సూక్ష్మోపాధియింద్రియమాయావిద్యోపాధి కళ లగు జీవేశ్వర ప్రపంచమేర్పడెననియు తెలియుము.

గీ. దృశ్యలీలలు జడమనో ♦ దృష్టిజగము
కామలోభంబుహంకార * కలహమయము
జీవిచాంచల్య గుణకర్మ * చింతనుము
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 48

తా॥ శిష్యా! మనోదృష్టికి గోచరించు యీజడశరీరము లోపల కామక్రోధాది రిపుసముదయము జేరి నిన్ను గుణకర్మము లలోముంచి చపల చంచలచిత్తునిగా జేసి వైచుచున్నది.

గీ. జీవ శివభేద వాచ్యార్థ * చిత్రమరసి
ఉభయలక్ష్యార్థసాక్షుల ♦ ఉపము దెలిసి

పాపపరివర్తనము సేయు ♦ భక్తరాసి .
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 49

తా॥ భక్తా! త్వంపదతత్పదవాచ్యార్ధ లక్ష్యార్థముల దెలిసికొని, అందు వుభయవాచ్యములను వదలి లక్ష్యార్థమునందు ఏకభూతమైనయెడల జన్మకర్మలు నశించి భక్తకోటి పునరావృత్తి రహితమగు పదమును జెందుచున్నారు.

గీ. చిత్తశిథిలంబ విశ్వాస ♦ చెనటులకును
దూర్తపాషండ నాస్తిక ♦ ధూతలకును
సాధుస్వర్గీయజీవనము ♦ చాటకిలను
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 50

తా॥ శిష్యా! చిత్తనిలకడలేక గురు దైవములయందు నమ్మికలేని వారె దుర్మార్గులు, వారే పాషండులు, నాస్తికులు అట్టివారికి యీదేవరహస్యమును దెలుపరాదు.

గీ. నింగిగాలియు నిప్పును ♦ నీరుమన్ను
భూతసాత్వికహంశచే ♦ బొలసిమున్ను
కర్మవాసనజీవుడగు ♦ గనడుతన్ను
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 51

తా॥ శిష్యా! పృథివ్యాది పంచమహాభూతములు సాత్వికహంకకలయుకచే యీజీవికి నిలయమగు యీకర్మశరీరము

గలుగుచున్నది. ఇది తన్నుతా తెలియని భ్రమప్రమాదమున జీవుడగుచున్నాడు.

గీ. అహము నభిమానమెన్నొకటై ♦ నరయుదగును
అహమునఁదోచి జగముతా ♦ నన్యముగను
సుప్తియందు నభావమౌ ♦ శూన్యముగను
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 52

తా॥ భక్తా! నేను అను అభిమానమును ముందు విచారించుము. అట్లు విచారించిన నీకు దేహ ప్రపంచములు వేరైదోచును. ఇందుకుసుషుప్తియే ఉదాహరణము. సుషుప్తియందు బాహ్యాంతర ప్రపంచములు శూన్యమైపోవుచున్నవి.

గీ. జాగ్రత్స్వప్నప్రవృత్తి జడ ♦ జాతముగను
కార్యకారణ జీవేశ ♦ కారకులును
విశ్వతేజసులై వెలసె ♦ విశ్వముగను
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 53

తా॥ వ్యష్టి సమిష్టి జాగ్రత్స్వప్నములకు కార్యకారణ రూపులైన జీవేశ్వరులు విశ్వతైజసవిరాట్టు హిరణ్యగర్భాదులై అంతర్బాహ్య జగత్తులు కల్పించినారు. యిని ఆతయు యెరుక చిత్రమే.

గీ. సుప్తినెన్నగ వటబీజ ♦ సృష్టితెరగు
జాగ్రత్స్వప్నంబునఁ వృక్ష ♦ శాఖలెసగు

కార్యకారణజగద్రూప ♦ కాండనెరుగు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 54

తా॥ శిష్యా ! ఎట్లనగా సూక్ష్మమగు మఱ్ఱివిత్తునందు స్థూలమగు మహావృక్షము లీనమై బీజోత్పత్తి అయినవెంటనే మఱ్ఱిచెట్టు బ్రహ్మాండమై బయలువెడలినట్లు సుషుప్తియందు లీనమైన జాగ్రత్స్వప్నప్రపంచములు జాగ్రదవస్థయందు యథాప్రకారము నీకు దోచుచున్నవి.

గీ. జాగ్రత్స్వప్నంబునందహము ♦ ఛాయజగము
గుణమునభిమానకరణమై ♦ గలిగెక్షణము
సుషుప్తియందు విలీనమౌ ♦ సూక్ష్మమనము
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 55

తా॥ శిష్యా ! జీవుడు నేను అను అహంకారమునకు వశుడై జాగ్రత్స్వప్నములయందు సత్వ రజోగుణాభిమానియై విశ్వ తేజ సాకారముల ప్రపంచసుఖదుఃఖముల ననుభవించుచు తమోగుణజనకమైన సుషుప్తియందు సర్వలీనమై దోచుచున్నాడు.

గీ॥ దృష్టివెలలోను వెలుగొందు ♦ దృశ్యజగము
సృష్టియావరణవిక్షేప ♦ శక్తిబలము
జీవ శివరూపులై దోచె ♦ చిక్కుగనుము
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 56

తా॥ నాయనా! నిర్వికారమగు పరబ్రహ్మమునందు ముందు ఆవరణ విక్షేపములుదయించి (ఆవరణమనగా, సత్య వస్తువును, అసత్యముగా దోపింపచేయుట) విక్షేపమనగా లేనివస్తువు చిత్రించుట యీశక్తిద్వయమే జగదుత్పత్తికి మూలమై వ్యష్టి సమిష్టి భేద మేర్పడి వస్తుప్రపంచ మేర్పడెను.

గీ॥ భ్రమవికల్పితవస్తు ప్ర ♦ పంచసుఖము
స్వప్నభాతియు జడమనో ♦ జాగ్రగుణము
సుస్తిధారను లీనమౌ ♦ శూన్యజగము
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 57

తా॥ భక్తా! యీజాగ్రత్ప్రపంచము నీభ్రమచేత కల్పింపబడి అజాగ్రత్తమనోవాసనయే స్వప్నప్రపంచమగుచున్నది. ఈజాగ్రత్స్వప్నప్రపంచములు సుషుప్త్యాద్యవస్థయందు శూన్యమై దృఢపరుచుచున్నది. సాధకుడు దీనిని చక్కగా విమర్శించుట మంచిది.

గీ॥ జన్మ మృతినొందు ప్రతిక్షణము ♦ జాగ్రసుప్తి
విశ్వప్రాజ్ఞులకళలీల ♦ వెలయుజ్ఞప్తి
జీవచైతన్యుడై దోచె ♦ జెలగుసుప్తి
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 58

తా॥ శిష్యా! యీజీవుడు క్షణక్షణమును జాగ్రదవస్థయందు విశ్వుడను నామముతో వృత్తిజ్ఞానరూపుడై పుట్టుచు

సుషుప్తి యనవస్థయందు మరణించుచున్నాడు. సుషుప్తియవస్థ యందు చైతన్యమాత్రుడై దోచుచున్నాడని అర్థము.

గీ. జీవినెన్నంగబడు నవ ♦ చిన్నుడన్న
స్వప్న కల్పితుడనచిదా ♦ భాసుడెన్న
మొదటివాడందె తా ♦ పారమార్థిగన్న
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 59

తా॥ శిష్యా! యీజీవుడు పరిచ్ఛిన్నుడని, స్వప్నకల్పితుడని చిదాభాసుడని చెప్పుకొనుట అబద్ధము. పారమార్థికదృష్టిచే విచారించిన యితడే పరమాత్మ. యితడేవియుగాడు.

గీ. పారమార్థికదృష్టిచే ♦ బరగునెవడు
నతడుబ్రహ్మంబునకునన్య ♦ మనగదగడు
వ్యావహారికుడై దోచు ♦ వాడెవీడు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 60

తా॥ శిష్యా! సాధుపురుషుడు ప్రపంచ వ్యవహారము లందు సంచరించినను తనదృష్టి పరబ్రహ్మమునందే లయించి యుండును. తనకు పరబ్రహ్మమునకు భేదము లేక బ్రహ్మమై సంచరించుచుండును. ఇట్లుండినను ప్రపంచముతో తనకు సంబంధముండదు. తనకు భేదము లేదు.

గీ. చంద్రసూర్యులు పర్వత ♦ సాగరములు
వృక్షలతలును మృగపక్షు ♦ లుర్వినరులు
దృశ్యమైదోపనజ్ఞాన ♦ దృష్టిభ్రమలు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 61

తా॥ భక్తా! చంద్రుడు, సూర్యుడు, పర్వతములు, సముద్రములు, వృక్షములు, తీగెలు, మృగములు, పక్షులు, భూమి మానవులు వేయేల? చరాచరములెల్లయు నీకు గోచరించుట నీ అజ్ఞానదృష్టిచే భ్రమవలన దోచుచున్నవి.

గీ. అంధకారంబవిద్యన ♦ నాత్మజగము
మనఃకల్పితజడధార ♦ మాయగనుము
జన్మహేతువు జాగ్రమీ ♦ చాయవినుము
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 62

తా॥ భక్తా! నీమనస్సు అవిద్యకులోనై నిజమును తెలిసికొనలేక తుచ్ఛములగు జడశరీరాదులపై జాగ్రదవస్థగిట్టుమెరుగువలె చాయరూపమై జన్మాదులను ప్రకాశింపజేయుచున్నవి.

గీ. జగతిగనబడు ధనమాన ♦ సంభ్రమములు
మృత్యుదేవతకాహుతి ♦ మోహకళలు
మనసుడూహలు మోహమను ♦ మాయభ్రమలు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 63

తా॥ శిష్యా! నీవు గోచరించు సర్వమునకు నాశము తప్పదు ఇట్లు నశించుదానికి మోహమెందుకనగా, అదినీమనస్సులో గలుగు భ్రమచేత సమస్తము నమ్మి తెలియక చరించుచున్నావు.

గీ. అవయవంబగు దృశ్యమ ♦ నాత్మజగము
జడమునన్ననస త్తన ♦ సగుణపరము
గిల్టుస్వర్ణపుచాయ యీ ♦ కీలుగనుము
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 64

తా॥ శిష్యా! అవయవ సహితమై కనబడుచున్న యీ అనాత్మజగము. జడము, అసత్తు యివి అన్నియు సగుణమునకు పర్యాయపదములు, యీసగుణములోకములో కృత్రిమబంగారువంటిదని తెలిసికొనుము.

గీ. రాగద్వేషముల్ ఈర్ష్య ♦ రాజసమును
కామక్రోధాదిరిపువర్గ ♦ కూటమునను
సంగదూరుడు విషయుని ♦ స్సంగియగును
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 65

తా॥ నాయనా! రాగద్వేష కామ, క్రోధ, తమో రాజసాదిగుణముల కూటమిని జయించి, యింద్రియములను విషయములవంక బోనీక, సదాపదార్థదృష్టిచేనున్నవాడు సర్వపరిత్యాగియగు నిస్సంగియనబడును. ఇతడే సర్వపూజ్యుడు.

గీ. సూర్యగ్రహణంబు వతుగను ♦ జూడదగును
బ్రహ్మజీవికి మధ్యప్రతి ♦ బంధమిలను
బంధసంసారగ్రహణంబు ♦ పట్టుబడెను
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 66

తా॥ భక్తా! సూర్యుడు, చంద్రుడు, మధ్యభూమి అడ్డగించి సూర్యగ్రహణంబుగలిగినట్లు జీవునకు బ్రహ్మమునకును మధ్య ప్రకృతివేరుజేసి జీవుని అజ్ఞానముచేత ఆవరించి సంసార బంధమును జేసినై చినది.

గీ. బ్రహ్మగ్రహణంబుపాప్తిచే ♦ ప్రాజ్ఞులిలను
కామరిపుకులసముదయ ♦ కంటకులను
దగ్ధమొనరించిభవనది ♦ దాటజనెను
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 67

తా॥ శిష్యా! బుద్ధిమంతులైనవారు గురు ఉపాసనాదులచేత కామక్రోధాది రిపుకులవంశమును సంపూర్ణ నిర్మూలముగావించి జననమరణ ప్రవాహమగు సంసార నదిని బహు సులభముగా దాటుచున్నారు.

గీ. బ్రహ్మగోళంబు ప్రాజ్ఞజన ♦ ప్రాభవంబు
శయనసంచారసద్గోష్ఠి ♦ సత్పథంబు
సత్పరిసంగామృతపాన ♦ సాగరంబు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 68

తా॥ శిష్యా! స్వర్గమనునదే బ్రహ్మగోళము. అదే అమృతసాగరము. జ్ఞానులు సర్వదా ఆగోళమునందే దృష్టినిలిపి అమృతపానము జేయుచు భూచరులుగాక, అందుననే విహారించుచు యోగనిద్ర జెందుచుందురు.

గీ. బ్రహ్మజీవుడనాదియు ♦ బంధువునగు
తెలివిమాలిన అహమను ♦ తెఱలోదిరుగు
జీవిగను లేడబ్రహ్మమిక ♦ సిగ్గువునగు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 69

తా॥ శిష్యా! జీవాత్మ పరమాత్మ అది తెలియనివారు వీరిద్దరు అహంకారమను తెఱవేసుకొని యీజగత్తునందు కపట నాటక మాడుచున్నారు. కాని నిజమును విచారించిన యిరువురికి భేదము లేదు.

గీ. బ్రహ్మకామనయుపరతి ♦ బ్రహ్మక్రీడ
బ్రహ్మయోని సుగంధంబె ♦ ప్రజ్ఞనీడ
యోగరతికేళిదేలిన ♦ యెఱుకెప్రౌఢ
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 70

తా॥ భక్తా! విషయవాసనారూపమగు ప్రవృత్తియందు యిచ్ఛయే. కామమన, యిదిఅహంకారమునకు క్రీడాస్థానమై యున్నది. ఇదియే బ్రహ్మశక్తి అనగా అపరప్రకృతి. ఇది సదావిజ్ఞానధారతోఁగూడినదగుటచేత జ్ఞానులు దీని సంపర్కముఁ గోరి పరిపూర్ణసాక్షాత్కారము జెందుచున్నారు.

గీ. అసలునిర్గుణధనరాసి ♦ ననగనొప్పు
నందుగైకొన్న ధనముచే ♦ అందియుప్పు
శక్తియైశ్వర్యమొదవెనీ ♦ సగుణమెప్పు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 71

తా॥ సగుణము అసలు వస్తువుకాదు. నకలుగాభావించుము. సగుణముయొక్క సమస్తమైశ్వర్యములు శక్తియంతయు అప్పే నిర్గుణమునుండి అప్పుదెచ్చుకొని యీసగుణపృధివి బహుగొప్పవానివలె నటించుచున్నది.

గీ. అసలు నకలను విమర్శన ♦ ననుభవంబు
సగుణనిర్గుణవస్తు వి ♦ చారకంబు
భక్తకోటికమూల్యమౌ ♦ పరధనంబు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 72

తా॥ శిష్యా! పైవివరించిన సగుణ నిర్గుణములు రెంటిని అనగా సగుణమును నకలుగను నిర్గుణము అసలుగను ఏర్పడినవి యిట్టి సారా సారవిచారణయే భక్తులపాలిటి నిక్షేపము.

గీ. మనశ్శిథిలంబు భ్రమరూపు ♦ మాయలన్న
మాయలీలలు సగుణంబు ♦ మరుగుగన్న
సగుణవిభవమునకిలనుచు ♦ చాటరన్న
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 73

తా॥ భక్తా! బ్రహ్మమునందు దోఁచు అనాది స్వతసిద్ధమైన ప్రకృతియొక్క చాయయే నీదేహము. అద్దమునకు మురికి. అగ్నికి ధూమము ఆవరించునట్లు నిన్ను ఆవరించినందున యీ సగుణరూపమేర్పడినది.

గీ. మోహజడశక్తితనుమనో ♦ మధ్యమునను
కల్పనాలీలజగత్పి ♦ కాండకళలను
జీవచైతన్యమైదోఁచె ♦ చిత్తభ్రమను
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 74

తా॥ భక్తా! జగత్తు జడాకారమయ్యు చైతన్యమై నీకు దోఁచుట నీచిత్తభ్రమయే కారణము జాగ్రస్వప్నములకుమధ్య కారణ శరీరముయొక్క కల్పితమున జీవచైతన్య మేర్పడినది. లేకున్న జడాకారమైయుండెడిది గదా.

గీ. అనృతంబునచేత నమసుఖ ♦ జగము
నృతముచేతనముసుఖమగు ♦ ఋజువుగనుము
సగుణనిర్గుణయోగ ♦ విచారఫలము
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 75

తా॥ శిష్యా! నీకు సత్యము అసత్యముగాను దుఃఖకరము నగునది సుఖముగాను జూచుచుండు సగుణ నిర్గుణములను లెస్సగా విచారించి ఉన్నదున్నట్టుగా తెలుసుకొనుటయే యోగవిద్యావిచారమునకుఫలము.

గీ. జడశరీరంబు చఱసాల ♦ జన్మఖయిది
జగతిస్థావరజంగమ ♦ సృష్టిపాది
హేతువ్యవహారమయెమృషా ♦ యెఱుకసోది
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 76

తా॥ శిష్యా! వ్యష్టి సమిష్టి దృష్టిగల జీవేశ్వరప్రపంచములు కల్ల. జీవుడు పట్టుపురుగువలెగా శరీరమును చఱసాలలోజిక్కియున్నాడు. ఈశ్వరుడు స్థావరజంగమసృష్టికి కారణమైయున్నాడు. ఇట్లయ్యు సర్వమువిచారించిన సర్వమబద్ధమై పోవుచున్నది.

గీ. ఈషణత్రయమిహభోగ ♦ మింద్రియంబు
జడఘటంబున వెలుగొందు ♦ జాగరంబు
జన్మసుఖదుఃఖ హేతువౌ ♦ జడమనంబు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 77

తా॥ శిష్యా! జాగ్రదవస్థాభిమానియగు విశ్వుడు ధన, దార, పుత్రీషణలననుభవించుచు జీవుడని పేరొందెను. ఇట్టిజీవునకు సుఖదుఃఖాశ్రయమైన మనస్సే హేతువైనది.

గీ. త్రివిధదేహవిలాసంబు ♦ త్రిగుణరాసి
త్రివిధవస్థలనొందుచు ♦ త్రిపుటివెలసి
ప్రకృతిలతలల్లెభవనాశి ♦ భువనరాసి
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 78

తా॥ శిష్యా! యీ ఎరుకజాగ్రత్స్వప్నాది అవస్థలు సత్వాది గుణములు స్థూలాది దేహములు ద్రష్ట దర్శన దృశ్యములు మొదలగు తీగలతో యీజగత్తును చుట్టుకొని ఆవరించుచున్నది. విచారించిన (భవనాశి) అనగా పుట్టుకలేక మూలములేక మాయమగుచున్నదని తెలియును.

గీ. త్రివిధకోశాధిపటలమౌ ♦ త్రిజగములను
అస్తిభాతిప్రియకళల ♦ నమరితాను
అఖలరూపగుచు వెలుగతడే ♦ నరయనేను
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 79

తా॥ శిష్యా! సత్తు చిత్తు ఆనందరూపమై ప్రాణమయ మనోమయ విజ్ఞానమయములను కోశత్రయములచే, అండపిండ బ్రహ్మాండములను సృష్టించుకొని అందు అస్తిరజ్జువుతో గూడిన నేను అను అహంకార మన్నిటికి కర్తయని తెలియును.

గీ. దేహసుప్తినికలదోచు ♦ దేశకాల
వస్తువుల్ నందుఫలమేమి ♦ నొందెనటుల
నెరుకసంసారభ్రమలటులె ♦ నెరుగవేల
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 80

తా॥ శిష్యా! జాగ్రతయందుదోచు దేశకాలాది వస్తుసంపదలు స్వప్నమని దలంచుము. ఎందువల్లననగా మిథ్యారూ

పమగు యెఱుక చర్యలగుటవల్ల అన్నియుమిథ్యలే నీవేమియు పొందజాలవు.

గీ. త్రిగుణగర్భవర్తై వెలయు ♦ త్రిపుటియెద్ది
నిర్గుణజ్ఞప్తిచైతన్య ♦ నెలవునెద్ది
సకలదృశ్యవిలక్షణ ♦ సాక్షియెద్ది
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 81

తా॥ శిష్యా! మూడు గుణములే గర్భముగా అనగా బిడ్డలుగాబెట్టుకొని ద్రష్ట దర్శన దృశ్యములునై నిర్గుణచైతన్యమై నీకుదోచు స్థూలసూక్ష్మప్రపంచములకు విలక్షణ సాక్షియైనదేదో దానిని తెలిసికొనుము.

గీ. స్వస్వరూపోపదేశంబు ♦ స్వర్గమదియె
నిశ్చలజ్ఞానజ్యోతియా ♦ నేతయదియె
ఘనదృగాకాశ సాక్షా ♦ త్కారమదియు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 82

తా॥ శిష్యా! నీహృదయాకాశమునందు వెలుగుచు పైజెప్పిన సాక్షిరూపమేదిగలదో అదియే స్వస్వరూపము. దాని గురుశాస్త్ర నిర్ణయములచేత దెలియుటే స్వర్గము. అదియే మోక్షమని తెలియుము.

గీ. నీవునేనను వ్యవహార ♦ నెలవుజూడ
ఘనమవిద్యాంధకారమా ♦ కర్మపీడ

స్మృతియుజీవికనాడియా ♦ జన్మనీడ
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి.. 83

తా॥ భక్తా! అవిద్యకులోనైన జీవుడు వాసనాపరంపరల వల్ల నీవు నేను అనుభేద దృష్టిగలిగి పుట్టుచు గిట్టుచున్నాడు. అదియే కర్మఅనునది. జీవునికి యీఅవిద్యాస్మృతియే జన్మపరం పరములకు మూలమని తెలియుము.

గీ. ఘనమవిద్యాంధమా జడా ♦ కాశమునను
జీవపక్షులు విహరించు ♦ చిత్రమిలను
మోహదుర్గంధవాసనా ♦ మూలమునను
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 84

తా॥ భక్తా! మోహదుర్గంధమగు విద్యా విద్యలను చీకటికోనలో విద్యోపాధియగు ఈశ్వరుడును అవిద్యోపాధియగు జీవుడును కలిసి చిత్రముగా సంచరించుచున్నారు. జడాకాశ మనగా అజ్ఞానమని తెలియుము.

గీ. మాయమూలము వినుమనో ♦ మారుతమగు
సంభవంబగు లీనమా ♦ సదనమెరుగు
శాశ్వతంబనుఖనిజమా ♦ స్థానమునగు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 85

తా॥ భక్తా! మనస్సునకును, వాయువునకును భేదము లేదు మనస్సు వాయువును ఆధారముచేసికొని సంచరించుచున్నది

ఈమనోమారుతములు యెచ్చట పుట్టుచున్నవో ఎచ్చటలీనమా చున్నవో దానిని తెలిసికొనుము. ఆస్థానమే వాయువుకు మూలము.

గీ. శ్వాసమరికట్టుటయు యోగ ♦ సాధనన్న
భ్రాంతికల్పితమనుజు డ ♦ ప్రాణు డెన్న
శ్వాశ లెవనికో జీవు ♦ డశ్వరుడుగన్న
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 86

తా॥ భక్తా! శ్వాస ప్రాణాయామాది యోగముచేత పరిపూర్ణమును దెలిసికొనుటసున్న. ఇవి అన్నియు జీవసంబంధములు. అందువల్ల అశాశ్వితములై పోవును. అట్లు సాధించవలెనని ప్రయత్నించుట భ్రాంతియేగాని యితరముగాదు.

గీ. రజ్జుసర్పంబువతుశుక్తి ♦ రజితవిధము
స్థాణుపురుషునివత్తువంధ్య ♦ సుతునిగనుము
యింద్రజాలంబు చిజ్జడ ♦ మెరుకజగము
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 87

తా॥ శిష్యా! పరిపూర్ణమందు ఎటువంటి చిత్రములు యెన్నిగలుగుచుండినను యేమాత్రము అంటదు. ఈజగత్తుపుట్టుట గిట్టుట, సీభ్రాంతిజన్యమేగాని నిర్వికారమగు పరిపూర్ణమునకు సంబంధమే మాత్రమును లేదు.

గీ. జడమనోపాత్రనొకమారు ♦ సర్వముగను
భావనాసక్తి చింత త్రి ♦ బంధములను
పూర్తిపరివర్తనముసేయ ♦ పూర్ణుడగును
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 88

తా॥ శిష్యా! త్వంపదవాచ్యార్థమగు బంధత్రయముల ను అనగా భావన ఆసక్తి చింత మొదలగునవి. సర్వమిథ్యల ని ఒక్కపర్యాయము తెలిసికొని, ఇవి అన్నియు ఎరుకసంబంధము లని వదలినవెంటనే పరిపూర్ణమును జెందగలవు.

గీ. స్వస్వరూపంబు దృగ్బ్రహ్మ ♦ సాక్షియెన్న
పరమపదమన్న పరమాత్మ ♦ భవుడటన్న
అహముననె దోచు నామంబు ♦ లన్నియున్న
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 89

తా॥ భక్తా! నేను అను అహంకారమువలన, జ్ఞానమే బ్రహ్మమనిన్ని స్వస్వరూపమె బ్రహ్మమని సాక్షియే బ్రహ్మ మని పరమపదమని పరమాత్మయని యీశ్వరుడని అనేకవిధము లుగా దోచుచుండును. ఇవి అన్నియు యెరుకచిత్రములు.

గీ. విషయసుఖభోగవాంఛను ♦ విముఖుడైన
పూర్ణనిర్లిప్తవైరాగి ♦ పుడమిలోన
అంధుడనబడుపరిపూర్ణు ♦ డచలుడనిన
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 90

తా॥ భక్తా! అచలుడు విషయసుఖములను బరిత్యజించి అనగా ఎరుక సంబంధమును వదలి పరిపూర్ణమందేదృష్టిని నిలిపి చరించుచుండును. ఇట్టివాడు అంధునివలె ఉన్మత్తునివలె అజ్ఞానులకుగనబడుచుండును.

గీ. బట్టబయలున నేనేమొ ♦ పుట్టినట్లు
పుట్టినేనేమో బెరిగియు ♦ గిట్టినట్లు
నిట్టియన్నృతవార్తచే ♦ నెరుగుటెట్లు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 91

తా॥ నాయనా? బయలులోపల తాను పుట్టి గిట్టినట్లు తోచుట వృథ్యక్కి, ఎందువల్లననగా లేనిది నెన్నటికి భవనాశస్థితి జెందబోదు. గావున పుట్టుచావులనునది అబద్ధము ఎటుకెన్నడును లేనిది.

గీ. తనువులెన్నైననచ్చియు ♦ తేరలుచున్న
అచలపడమెన్నఝణకదు ♦ నడరిదన్న
వచ్చితరులట భ్రమలెన్న ♦ వట్టివదన్న
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 92

తా॥ భక్తా! పరిపూర్ణమునందు ఎరుక చిత్రములు ఎన్నిగలుగుచుండినను బయలున కేమాత్రము తెలియబోదు. ఈజగత్తు పుట్టిగిట్టినట్లు తోచుట నీభ్రాంతి జన్యమేగాని నిరావరణమగు పరిపూర్ణమునకు సంబంధమే లేదు.

గీ. నిర్గుణంబును నిరుపాధి ♦ నిరవయము,
వస్తురూపగుచు నేర్పడెడు ♦ హేయాయలింగనుము
సగుణసంపత్తి మరుగిదె ♦ చాయజగము
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 93

తా॥ ఓయీ! గుణరహితమైనదియు ఉపాధిలేనిదియు అయవ రహితమగు బట్టబయలునందు రూపనామ గుణధర్మముల తోగూడిన వస్తుప్రపంచమెవ్విధమున నేర్పడెను. ఇదేగదా సగుణవిలాసమగు మహామరుగు.

గీ. సాధకునిదృష్టిలోన న ♦ సారజగము
అసద్మృతదేహఘటమున ♦ నాత్మవినుము
అశ్వరంబగుచు బడియుండు ♦ నఖిలజగము
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 94

తా॥ భక్తా! జ్ఞానిదృష్టిలో యీజగత్తు మృతమై యసారమై, యసత్తైబడియుండును. పరిపూర్ణసమాధిపరుడు శ్మశానమునందొక మృతదేహమునుంచి పోవుచున్నాడు యీబాహ్యజగత్తే యామృతదేహమని తెలియుము.

గీ. బాహ్యజగతియు శ్మశాన ♦ పట్నమనగ
తోలుసంచులు శవములీ ♦ తనువులనగ
పూర్ణయోగంబు దృష్టినీ ♦ పద్ధతెఱుగ
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 95

తా॥ భక్తా! ఏవికల్పములేక సదా పరమార్థదృష్టితోనుండు మహాత్ములకు యీజగత్తు శ్మశానవాటికిగాను అందు చరించు భూతములన్నియు వట్టితోలుసంచులుగాను దోచుచుండును.

గీ. జడమనంబునచింతాగ్ని ♦ జ్వాలలెగయ
వాసనాలీలజగమయ్యె ♦ వాచ్యమెనయ
పూర్ణ జలముచే జల్లార్ప ♦ పూర్ణపరయ
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 96

తా॥ భక్తా! అనేకజన్మవాసనామూలమగు అంతఃకరణేంద్రియమందు తాపత్రయాగ్నికలిగి దానిజ్వాలలు యీజగత్తున వ్యాపించి దహించుచుండగా వీటికి మూలమగు యెరుకను సమూలముగా నశింపజేసిన ఆ అగ్ని తక్షణంచల్లారునని తాత్పర్యము.

గీ. కదలికదలనిస్థలమందు ♦ గలసిమెలసి
జగములెఱుకలు లీనమౌ ♦ సదనమరసి
శూన్యసింధువు దరిజేరె ♦ సుజనరాసి
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి 97

తా॥ ఓయీ కదలి కదలని అనగా స్థిరమూ అస్థిరమూఅను నిర్ణయములేని శుద్ధ సత్వప్రధానమగు యెరుకను దెలిసియీ యెరుకను మూల బీజమగుస్థానమును శోధించి జూచిన యెరుక జగత్తులు రెండును మిశ్రమైలై నిర్గుణపరబ్రహ్మస్వరూపులగుదురు.

గీ. స్థూలయంత్ర విమానంబు ♦ సూక్ష్మమునను
జడమనోయంత్ర త్రైగుణ్య ♦ చక్రమునను
చిజ్జడాకాశముఁ జెగయు ♦ చిత్రముగను
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 98

తా॥ శిష్యా! స్థూలదేహమును ఆకాశ విమానమునకు అంతఃకరణమే యంత్రముగాఁగలిగి సత్త్వాదిగుణ సముదాయ చక్రముచేత విశాలమగు చిదాకాశమధ్య సదాసంచరించుచున్నది. దీనిమూలమును దెలిసికొనుము.

గీ. మిథ్యకల్పిత వైరాగ్య ♦ మిడతలకును
ప్రాణధారణజపతపో ♦ భజనలకును
శాస్త్రతర్కుఁ వాదుల ♦ చర్చ జడయకిలను
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 99

తా॥ శిష్యా! బాహ్యసన్యాస వేషధారులగు ప్రాణాయామజపతపోభజనపరులనుజూచి అనగా ఎప్పుడు జపించువారివలె నటించు వేదాంత తార్కికులనుగని భయపడవలదు. మిడతల నగా మిడతలొకవోలె స్థిరముగా నిల్చునవిగావు.

గీ. ఆత్మకన్యంబవిద్యయు ♦ నాదిమాయ
యోనిసంభవమగు సృష్టి ♦ నెఱుగడాయ
జన్మజాగ్రంబుఁ లముటె ♦ జాడమాయ
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 100

తా॥ భక్తా! మాయా ప్రతిబింబితమగు అవిద్యకు నిర్వికారమగు ఆత్మకు యేకాలమందును సంబంధము లేదు. సృష్టిస్థితి లయాదులు నెఱుగదు. జన్మ కర్మకు జాగ్రదాది ప్రపంచ

ములకు అన్నిటికి మూలము ఎరుకెగదా పరిపూర్ణమునకు సంబంధ మెంతమాత్రము లేదు.

గీ. వస్తువన్నను పరవస్తు ♦ సద్వస్తువనగ
పరమపదమన్న నచల ♦ పరిపూర్ణమనగ
బయలుకివిజెల్లు పర్యాయ ♦ పదములెరుగ
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 101

గీ. వస్తువంతస్థనంబగు ♦ వసుధలోను
దుర్బలన్యక్తజనముకు ♦ దూరమగును
వస్తుప్రేమసుగంధంబు ♦ వయిఖరిగను
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 102

గీ. వస్తుసౌందర్యగుణలీల ♦ వైభవంబు
భక్తియోగసుగంధమో ♦ పరిమళంబు
సాధుజనశ్రేణిసేవించు ♦ సత్ఫలంబు
రమ్యగుణభోగి సత్కీర్తి ♦ రాజయోగి. 103

గీ. వస్తుపూర్వమునామంబు ♦ వసుధ లేదు
వస్తువిడిచియునామంబు ♦ వుండబోదు
వస్తుదృష్టినినామంబు ♦ వదలరాదు
రమ్యగుణభోగిసత్కీర్తి ♦ రాజయోగి. 104

గీ. నామసాధన దుర్బలన ♦ నాధకగును
వస్తుభావనసుగంధంబు ♦ వ్యక్తిగనును
వస్తునామంబు విమర్శిన ♦ వైఖరిగను
రమ్యగుణభోగిసత్కీర్తి ♦ రాజయోగి. 105

